శ్రీ

శ్రీ విఘ్న...

# శ్రీగజేంద్రమోక్షదండకము.

ఇది

భగవద్భక్తుల కత్యంతోపయుక్తంబగు

నటుల సర్వజనరంజకంబుగా.

కాకినాడ తాలూకా పెదబ్రహ్మదేవగ్రామ

నివాసియు శ్రీ ఖండేరాయని అన్న

నామాత్యతనూభవుండునగు

నారాయణ కవిచే

రచియింపఁబడి



మొదటికూర్పు 500 ప్రతులు.

సూర్యారావుపేట కాకినాడ. ఆల్బర్టు

ముద్రాక్షరశాలయందు గ్రంధకర్తచే

ముద్రింపించి ప్రకటింపఁబడినది.

1922.



వెల 0—2—0

శ్రీ

# శ్రీగజేంద్రమోక్షము

——[o]——




మద్రమామానినీ మానసాం
భోజ పీఠస్థితస్వాంత్ర భృంగా గ
రుత్మత్తురంగా పదాంభోజ సం
భూత సత్స్వనాకాశిసింగా ర
మాలింగితాంగా దయాపాంగ
మాహేశ్వరోదగ్ర భాస్వద్ధను
ర్భంగ యశ్శ్వేత ధారాధరా
భంగ సర్వేశ్వరా సర్వసర్వం సహాభారనిర్వా
హకా ఘోరసంగ్రామదుర్వార దుర్వారదోర్గర్వ
నిర్వాపకా నిర్వికల్పప్రభావా లసత్కౌస్తుభశ్రీనికే
తనానాజగద్దోషభారా సురాధార పీతాంబరా

కూర్మి తండోప తండంబుగాఁ శైనమై పోవఁగా
ఘోరదుర్వార గాఢాంధ కారంబులో గహ్వ
రద్వార దేశంబులం జొచ్చు భల్లూక సంఘంబు
తో గొబ్బునన్ వ్రేతలం బట్టి తబ్బిబ్బుగా బొబ్బలం
బెట్టు శార్దూల బృందంబుతో భీతిచే జెంగునం
చోంకలం దాటు కుందేళ్లతో తెల్లతో వాఁగుల
న్వాఁగు తోడేళ్లతో గూళ్లలోనుండి జీవ్ జీవ్వ
నం దింగికిం బాఱు పూరేళ్లతో బండలామ్మేళ్ల
తోఁ బుట్టలం జొచ్చు దర్వీకర శ్రేణితో సమ్మ
హారణ్య దేశంబు గగ్గోలుగానుండగాఁ బట్టఁబగ్గం
బులుం లేక కుంజంబులం జొచ్చుచుం నూతనా
ష్లాన సన్మంజరీ పుంజముల్ నుగు నుగాడుచుం
గాండముల్ మింటికిం జాచి ఫెళ్ ఫెళ్లునం గొ
మ్మలం గూల్చుచున్ లెక్కకుం మించి కస్పట్టు
చు త్రేధయూథంబులోఁ గోటిభార్యల్ హాయి
ల్ మీఱంగాఁ బార్శ్వ భాగంబులం దన్ను సేవిం
చుచుండన్ గజేంద్రుండు సంతోష మొప్పారఁ
బెంపారు జొంపంబులం మేయుచుం సొంపుగా
గుంభులం గూడుచుం జెంపునం దున్నలం దూ
ష్యలం దంపుచుం గొండలం గూల్చుచుం గం

దక్షైలంబులన్ బిండిగాఁ జేయుచున్ బంజరీకంఠ
ములన్ బట్టి దండింపుచున్ దట్టమౌ చెట్లనీడన్
మదంబొప్పఁగా నిల్చుచున్ ప్రేమతో భార్య
లన్ బిల్చుచున్ మచ్చికన్ బచ్చికందించుచున్
బెద్దకాలంబు స్వేచ్ఛావిహారంబులన్ సల్పుచున్
ముప్పిరిన్ గొన్న బ్రాప్తికిన్ జెంది తాదైవ
యోగంబుచే మార్గమున్ దప్పి భార్యాసమేతం
బుగా ముందటన్ గొంత దూరంబులో నిర్మల
స్వాదువారీపూరమున్ దుర్మదాభీలకూర్మేంద్ర
మత్స్యగ్రాహ కుంభీరమున్ మందరంగత్తరంగౌ
ఘగంభీరమున్ యక్షగంధర్వ రక్షోనరస్త్రీజ
నాధారమున్ రత్నసోపాన పాళీల సత్తీరమున్
రాజహంసాళి చక్రవాకాది నానాఖగశ్రేష్ఠ
సంచారమున్ జారు కాసారమున్ గాంచి యం
తన్ బ్రవేశించి భామామణుల్ దాను డెంద
మ్ములుప్పొంగ నందమ్ములై మీఱు కెందమ్ములన్
ద్రుంచి తోయమ్ములన్ జిమ్మి యాపై మత్తే
దోయముల్ తుండముల్ నిండఁబూరించి ఫూ
త్కారముల్ సేసి గండంబులన్ దంష్ట్రాదుల్
గొంచున్ వడిన్ గర్కటగ్రాహ మండూక మూ

తొల్యసమౌఁ గ్రిందికిఁ గాళ్ల చేఁ గుత్రమ్మమఁ
వ్రేళ్లతో నొడ్డుపైనున్న వృక్షంబులఁ గూల్చు
చుఁ దత్తటాకంబు నిరితిగా నల్లకల్లోలముఁ
జేయుచుఁ దిక్కులన్ మాఱ్మ్రోఁగ ఘోరఘీం
కారముల్ సేయుచుఁ బ్రీతితోఁ జలక్రీడలఁ
సల్పుచున్నంతలో నొక్క నక్రంబు కోపంబు
గాలరుద్రాకృతిఁ దాల్చి కెంగన్నులఁ విస్ఫులిం
గంబులఁ రాల్చి ఝుంకారమొప్పార హుంకార
ముఁ జేయుచుఁ భానుని స్వర్భానుభం
గిఁ శరీరంబునుంగుంచి తా మెల్లగాఁ బొంచి యా
నీటిలోనుండి కుప్పించి లంఘించి యిట్టట్టుపోఁ కుర
వఁగా గట్టిగాఁ బూర్వపాదంబులఁ బట్టఁగా సం
తుకై చేలపోకుండఁగా నగ్గజేంద్రిం
ము తా నట్టె తుండంబుతో నక్రముఁ
గొప్పలా చిప్పలెల్లఁ గుదుల్లోఁడి యొక్కు
మ్మడిఁ జల్లఁ రాలి రక్తప్రవాహంబులఁ
జిమ్మ దర్పంబుతో వ్రేయఁగా నీటిలోనక్కు
మఁ జంకులేకుండఁగా మీదికిఁ వచ్చి యవ్వే
ను తోఁకఁ ముందుకాళ్లఁ వడిఁ బట్టఁగాఁ బట్టు
తప్పించుకోలేక శోధించి మాన్పించు దంతిమ్ము

లన్ దానివక్షమ్మునన్ మూర్ఛిల్లన్ వ్రేయఁగాఁ
గాళ్ల కడ్డంబుగాఁ జొచ్చుచున్ నీళ్లలో డాఁగుచున్
గోళ్లతో వాలమున్ జీరుచున్ ఫెళ్లనన్ దంత
ముల్ మళ్లఁగా వ్రేయుచున్ జెళ్లునన్ వెన్నుపైఁ
గొట్టుచున్ డిల్లపోకుండ బింకంబుతో నేనుఁగన్
లోనికిన్ లాగుచుండన్ గజేంద్రుండహంకార
మున్ దాల్చి తాదుర్నివారోగ్రఘీంకారుఁడై దుస్స
హోదగ్ర హుంకారుఁడై భీకరాకారుఁడై ధీరుఁ
డై శూరతన్ గ్రాహమున్ బట్టి తుండంబుతో
నొప్పుపై కెత్తుచున్ శైలమున్ దాఁకు శైలంబు
చందాన డీకొంచుఁ బెక్కేండ్ల హోరాత్రముల్
ధారతో నిల్చి యాహారనిద్రాదులున్ లేక గ్రా
హంబుతోఁ బోరి పోరాడఁగా లేక వేసారి వేసారి
చింతాసమాక్రాంతుఁడై భార్యలన్ గూడి ఘో
రాటవిన్ స్వేచ్ఛగానుండ కుండంగ నేనయ్య
యో దైవమా యేటికిచ్చోటికిన్ నీటికై వచ్చితిన్
నేటికిన్ నేను ముమ్మాటికిన్ దీనికిన్ నోటికాహా
రమై చిక్కితిన్ జిక్కితిన్ నేఁడు నాకెక్కడన్ ది
క్కెవండంచు యోజించి యేరీతిగాఁ డీని సేగల్గు
నే దైవమున్ గొల్తునే నెవ్వరిన్ బిల్తు నీబాధ

బ్రోచునో యీశ్వరాయంచు ధ్యానించుచున్
బూర్వజన్మార్జితజ్ఞాన సంపత్తిచే నాదిమధ్యాంత
శూన్యుండు వాఙ్మనసాతీతుఁడెవ్వాఁడో యీవిశ్వ
మెల్లన్ లయంబైన తర్వాత నేకాకృతిన్ దాను
జ్యోతిర్మయాకారుఁడై యుండు వాఁడెవ్వఁడో జం
తుజాలంబులన్ లీలన్ సృష్టింప రక్షింప గిట్టింపగాఁ
బ్రహ్మాదీశ్వరాభిఖ్యలొప్పన్ బ్రవర్తించు
వాఁడెవ్వఁడో నర్తకశ్రేష్ఠు చందంబునన్ బెక్కు
వేషంబులన్ జూపువాఁడెవ్వఁడో తోఁచియే తోఁచ
నట్టి జగద్గోళముల్ మాయలోముంచి దోబూ
చులాడించి వ్యామోహముల్ జూపు వాఁడెవ్వఁ
డో సర్వమున్ దానయై సాక్షిగా నుండువాఁడె
వ్వాఁడో యట్టిసర్వేశ్వరున్ సర్వశక్తున్ విరిశున్
బరబ్రహ్మమున్ గూర్చి రక్షింపుమా యంచు నే
నెంతప్రార్థించినన్ నిర్దయుండై ప్రసన్నుండు
గాకుండెనంచున్ గజేంద్రుండు చిత్తంబునందున్
వితర్కించుచున్ శ్రీహరిధ్యాన సంకల్పుఁడై
దుర్భరాకన్నుఁడై ఖిన్నుఁడై యక్కటా యెవ్వఁ
డుద్ధతిబు రాడాయెనంచున్ విచారించుచున్ ది
క్కులన్ జూచుచున్ భక్తలోలాదయాశీల శా

గేలరానాకు నిట్టూర్పులంతంతకున్ హెచ్చుచుం
డెన్ శరీమంబయ్యె ధైర్యంబుక్షీణించె నీనేత్రనా
పాళిముల్ తావులన్ దప్పుచుండెన్ సరోజాక్ష
నాపైఁబరాకేలరా నామొఱాలింపరా శ్రీధరా
క్రూరదుర్వార నీరాటరాడ్ఘాటికిన్ దాళలేనింక
వైకుంఠవాసా హరీ శ్రీనివాసా లసత్స్వర్ణవా
సా రథాంగాయుధా సుందరాకార యోహిశకంధిరా
ణ్మందిరా యిందురావేమిరా యింధిరాసుందరీ
వల్లభా దుర్భరా పత్సముద్రంబులో మున్గియుం
టిన్ దరిన్ జేర్చి నన్నాదరింపన్ దొరానీవెకా
దా మురాధ్యక్ష నీకంటెవేఱొండు దైవంబులే
దంచు నిన్నెనమ్మితిన్ బోరివరా దేవరా శ్రీవ
రా వేగరారమ్ము బాధన్ నివారింపుమా సజ్జనా
ధార యోదుష్టసంహార సద్భక్తమందార సర్వే
శ్వరా శ్రీహరీ పాహిమాం పాహిమాం పాహి
యంచున్ మొఱల్ పెట్టుచుండంగ వైకుంఠ
పట్టణంబందు నామూలసౌధోప కంఠంబునన్
ధావలన్ దివ్యమందార వృక్షాటవీమధ్యపచ్చం
తరి కాంతోత్పలస్నిగ్ధ పర్యంకమందున్ రమా
దేవితోఁగూడి యుల్లాసమొప్పార సల్లాపముల్

వేయుచున్ వానియా ర్తస్వరంబ్బై యాలించి ధి
క్కుల్ పరీక్షించుచున్ గద్గదాలాపముల్ వచ్చు
దిక్కున్ నిదానించి డెందంబులో నయ్యెడా
ముంబడవచ్చెఁ గదా దుష్టనక్రింబు చేఁజిక్కి పా
క్షావశిష్టంబుగా బాధితుండయ్యె నోహో గజేం
ద్రుండటంచున్ విచారించి దేవాదిదేవుండు వ
ద్భక్తసంరక్షణోపాయ దీక్షావరాధీనుఁడై దిగ్గు
నన్ లేచి యయ్యిందిరాదేవితో మారుమాటా
డకుండన్ గరుత్మత్తురంగంబుపై నెక్కకుండన్
మహిన్ శ్రీవధూటీకు చద్వంద్వ భాగంబుపై
వ్రేలు చేలాంచలంబైనఁ జేవీడకుండన్ గదాశం
ఖచక్రాది దివ్యాయుధశ్రేణిఁ జేపట్టకుండన్ న
భోభాగమార్గంబుగాఁ దానువేంచేయు చున్నం
తలో వానివెంటన్ రమాదేవి తర్వాతఁ బక్షీం
ద్రుఁడున్ వానిపొంతన్ ధనుఃఖడ్గకౌమోదకీ
శంఖచక్రింబులా వెంగటన్ నారదుండిట్లు వై
కుంఠమందున్న వారందఱా బాలగోపాలమున్
వెంబడింప నక్రియాదేవి డెందంబులో నేమియా
చిత్రిమా స్వర్గలోకంబుపైఁ దైత్యవర్గంబు వం
కాకైనా విఘ్నుఁడెందుండెనో చూపుమాయం

షుఁ దర్శించి దండించుచుఁ భక్తులఁ బట్టి
దుర్మార్గులెందైన బాధించుచున్నారో లేకున్ననీ
వైపరీత్యంబు రాఁగారణంబెద్దియోయంచు నం
దేహమ్ముఁ బొందుచుండంగ నాయంతరిక్షంబు
నఁ బోవు చక్రాయుధమ్ముఁ గాంచి సద్భక్తితో
దేవతల్ నేతులఁ మోడ్చి తుభ్యంనమో విశ్వరూ
పాయ నారాయణా యాప్రమేయాయ సత్యస్వ
రూపాయ వేదాంతవేద్యాయ యంచుఁ మహో
త్సాహులై చేయు కైవార మాలింపకుండఁ ద
దేకాగ్రదృష్టి ప్రసారంబులో భక్తవాత్సల్య
మేపారఁగాఁ దత్ప్రదేశంబునఁ డిగ్గి దుర్వారసం
గ్రామనిర్వక్రమ్ముఁ ఖండితానేక దేవద్విషచ్చక్ర
మ్ముఁ విక్రమాటోప సంభూత శోహారవాభీల స
ర్వం సహాచక్రమ్ముఁ జక్రమ్ముఁ గాంచి యానక్ర
కరంబు ఖండింపుమాయంచుఁ బంపఁ లసద్భూరి
వంకేశగర్భాండభాండంబు కంపింపగా భీమమై వి
స్ఫులింగచ్ఛటోద్దామమై ఛన్నదిగ్భాగ సాంద్రో
ల్ల సద్ధూమమైవంది తానేకబృందారక స్తోమ
మై సిటిలోమున్ని శీఘ్రింబుగాదాని కంఠంబుఖం
డింపఁగా శ్రీహరీ శ్రీహరీ యంచు నక్రంబు

పా[illegible]ంబులఁ జేయఁగా నగ్గజేంద్రుండు సం
[illegible]ముఁ బొందె వెన్నుండు శంఖంబు బూ
రించె బృందారకుల్ దుందుభుల్ వేగ మ్రోయిం
పఁగా నప్సర స్త్రీమణుల్ నాట్యముల్ సల్పఁగాఁ
శ్రీమలో నొడ్డుపైఁజేర్చి కేలూతగానిచ్చి లేలె
మ్మి శేంధ్రా భయంబేల యాయాసముఁ దీ
ర్చుకొమ్మంచు నోదార్చి హస్తంబుచే మెల్లగా
దువ్వఁగా దుఃఖముఁ బాసి పూర్వస్థితిఁ బొంది
ఘీంకారముల్ సేయుచుఁ భార్యలఁ గూడి యు
ప్పొంగఁగా నంతటఁ దేవలాభిఖ్య మానీంద్రు
దత్తోగ్ర శాపాభినిర్ముక్తుఁడై పాపసంత్యక్తుఁడై
పూర్వ రూపంబుతో దీననాదానులాపంబుతో
ముంగిటన్ నిల్చి దాసోహమంచుఁ నమస్కార
ముఁ జేసి దేవాదిదేవా హరీ వాసుదేవా ద
యార్ద్రస్వభావా లసచ్చిత్ర చిత్రప్రభావా ము
కుందా మురారీ శుభాకార హాహాహూనమా
ఖ్యుండ దుర్వార గర్వాంధుఁడన్ నేను గంధ
ర్వుఁడన్ బూర్వజన్మార్జితంబైన నాపుణ్యలేశం
బుచేతన్ భవద్దివ్య రూపంబు నేఁగాంచు భా
గ్యంబు చేకూరె నా[illegible]లీచేత నాజన్మసత్యం

త సాఫల్యమును బొందె సర్వేశ్వరా నిన్నువర్ణింప నెవ్వరెంతవారలు దురాత్ముండ మూఢుండ నంతనెట్లు ప్రశంసించి గీతంబులం బాడి యాదేవునాజ్ఞం ముదంబొప్పఁగా నాదలందాల్చి గంధర్వలోకంబునందుం బ్రవేశించె నంతం గజేంద్రుండు శ్రీవిష్ణు హస్తంబు స్పర్శమాత్రమ్ముచేఁ దానగస్త్యర్షి శాపాభినిర్ముక్తుఁడై నిర్మలస్వాంతుఁడై విష్ణుసారూప్యమున్ బొందె నీదండకంబుంజనుల్ నిత్యమున్ భక్తితో విన్నమాత్రాన శ్రీవిష్ణు సాయుజ్యమున్ బొందుట బ్రింబె సద్భక్త చింతామణీ దైవచూడామణీ ధీమణీ చక్రపాణీ హరీ రుక్మిణీ వల్లభా వాసుదేవా నమస్తే నమస్తే నమః శ్రీ శ్రీ శ్రీ.

## శ్రీగజేంద్రమోక్షదండకము.

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

